ఎన్నఁడో చిన్ననాఁడు ఛందస్సు నలవఱచుకొను రోజులలో నుబుసుపోక కప్పుడపుడు కందపద్యములు కొన్నింటి నల్లియుంటిని. అవి యచ్చునకుఁ దెచ్చినచో నధునాతనబాలికలకు సాహ్యాపడునని తలంపుకలిగినది.

దాన నందలి కొన్నింటి నేరి, వలయు మార్పులు కూర్పులు చేకూర్చి యీరూపమున వెడలించితిని. ఇట్టివ యింకఁ గొన్నింటిని మఱొక తూరి ప్రకటింతును.

# సంస్మరణము

అనుదినము నాదు జీవిత
మున వెలుఁగుల నిచ్చగించి పోషించిన నా
జననీజనకుల సతతము
మనమున స్మరియించువాఁడ మాననిభక్తిన్.

శ్రీః

# సతీ సప్తతి

సత్యదయా శౌచంబుల
కత్యలఘు పవిత్రతకును నాశ్రయమై, తా
నిత్యము నిర్మలగృహ సాం
గత్యమె శ్రీదేవికోరి కరుణవసించున్.

తూర్పుదెస, లోకమిత్రుఁడ
హార్పతి యుదయించుపూర్వ మాత్మోచితమౌ
నేర్పునఁ గరణీయముల నొ
నర్పుము గృహలక్ష్మి ముదమునన్ నినుఁజేరున్.

భువి, లౌకిక సౌఖ్యాదుల
నవిరళముగ ననుభవింప ననువగువిద్యన్
బ్రవిమల జ్ఞానఫలంబును
జవిచూడు కుమారి! భర్తృసాంగత్యమునన్.

వనితకు గృహకృత్యంబుల
ననుపమ వైదుష్యవిభవ మావశ్యకమౌ
టను, లౌకిక శాస్త్రీయము
లను విషయము గుర్తెఱుంగు టతివకు విధియౌ.

## సతీ సప్తతి

భారతనారీమణుల, యు
పారగుణగణమ్ము ప్రోచి భరియించిన స
త్సారస్వత గ్రంథంబుల
నారయుచుండుము కుమారి ! యతికుతుకమునన్.

విద్యాగంధంబున్నను
హృద్యంబగు వినయగుణము హీనంబైనన్
సద్యశము నందఁజాలక
వద్యతఁగాంచెడును మనుజవర్గము సుదతీ !

తల్లియుఁ దండ్రియు విద్యల
బల్లిదులేమైననాఁడు పరికింపఁగ నా
పిల్లలు వినయవివేకము
లుల్లసిలఁగ వెలయుచుందు రూర్జస్వలులై.

తగుసమయమునకు శూన్యం
బగు విద్యయు, నిర్మనుష్యమగు విపినమునన్
దెగఁగాయు వెన్నెలయు నీ
జగమున వ్యర్థంబు లనుట సత్యము సుదతీ !

ఇల సంసార రథంబును
నలఘుపథంబునను నడుప నావశ్యకమౌ
కలకాలముండు ప్రేమయె
లలితమతీ ! సతికిఁ బతికి రంగఁరంగన్.

అతికోపియైన పతియును,
వితతగుణగణాన్వితయును విద్యావతియా
సతివలన నధికశాంతా
త్మతఁ బడయుట సహజమండ్రు తత్వజ్ఞులిలన్. ౧౦

శ్రమమున గడియించెడు న
ర్థము సముచితముగను వ్యయము తరుణి యొనర్పన్
గ్రమమునఁ బురుషుఁడు ధన్య
త్వము చెంది సుఖించు గృహిణి తత్వంబిదియే.

గృహమునకు వన్నెవాసియు
నహరహ మభ్యుదయవర్గ మనుపమసుకృతం
బిహపరసౌఖ్యము గూర్పఁగ
గృహిణియ కారణ మటండ్రు గేస్తునకు మహిన్.

ఉభయులు శాంతాత్ములునై
సుభగాకృతి కలిగి నిత్య సుఖులైయున్నన్
విభవంబు లేల! స్వర్గ
ప్రభవంబదియేల? సుదతి? పరమార్థమిదే!

పతి నిఱుపేద తనంబున
నతి కష్టములంది సుగతి నందకయున్నన్
సతి, ధర్మనిరతి, సముచిత
గతియై తద భేదవృత్తిఁ గాలము పుచ్చున్.

## సతీ సప్తతి

ప్రతివేళ యువతులకుఁ దన
గతియు గృహంబునను గల్గు కలవరములు, స
న్మతిగల సతి నుడువదు, తన
పతిసేమము నభిలషించి పరగుటవలనన్.

పతియే సర్వస్వంబని
సతతంబును విశ్వసించు సతులను నరయన్
క్షితి నధిక తపోన్వితులగు
యతి వరులును బోలనేర రద్భుతమహిమన్.

సిరిగలవారిని గాంచుచు
పరివారము కాము మనము, సర్వవిధాలం
కరణములు గూర్చుమని, నీ
వరుని వృథా వశునిఁజేయ వలదు కుమారీ ?

ఎఱువుగ గడియించిన యా
భరణంబులు తనువునకును భారంబులు, నీ
వరుఁడేర్పఱచిన వానినె
మురిపమునను దాల్చి యధిక ముదమందుమిలన్.

పేదఱికంబునఁ బుట్టియు
నాథుని గృహమునను గల్గు నాగరకతచే
నేదియు లక్ష్యము సేయక
తాఁదిరుగుట సతికి ననుచితంబగు వత్సా !

పతి చెట్ట వట్టినప్పుడె
యతిప్రేమను బెంచియున్న యభిజనమును, వి
స్మృతిచెంది యగౌరవముగ
మతినైనను దలఁపకమ్మ మహినిఁ గుమారీ! ౨౦

పతిపైని యలుకఁబూనియు
సుతులను బడఁ దిట్టికొట్టు సుదతి ద్వివిధమా
వెతలనుభవించు దానినె
యతిమూర్ఖత యందురవని నార్యజనంబుల్.

ఇరుగునఁ బొరుగునఁగడు లే
బరమగు కాఁపురములున్నఁ బరికించి, భవ
ద్వాసు నాజ్ఞఁబూని వారల
నరయుచు సాయంబుచేయు మమ్మ కుమారీ!

తన జనకుని గృహమందలి
ధన మేకాంతముగ దోఁచి ధవుగేహము చే
ర్చిన యువతి యధిక నైచ్యము
నను జీవితయాత్ర నెపుడు నడపెడు సుదతీ!

నీదగు ప్రీతిభాధిక్యము
నీదు గుణగణంబు యోగ్య నిర్ణిద్రతయున్
నాధునకు వన్నెవాసియు
మోదము నధికముగఁగూర్చు భువునిఁ గుమారీ!

# సతీ సత్తుతి

మును సత్య హరిశ్చంద్రుని
వనితయుఁ బాండవుల ధర్మపత్నియుఁ భువిలో
ననుపమకీర్తి గడించుట
కును గారణమైనవారి గుణములు గనుమీ!

నీ పొసఁగు నౌషధంబులు,
కావించెదు కృత్రిమములు కాంతుని వశ్యం
గావింపఁ జాలవని నీ
భావమునను దెలిసికొనుట భావ్యము సుదతీ!

పతులకు వలె నతిమహి మా
న్వితలగు సతులకును సర్వవిధములను స్వాతం
త్రిత యుంటమేలు, నాగర
కత యదియే సుదతి! సర్వకాలంబందున్.

స్వపతికి, యువతి గృహంబున
నుపకరణమటంచుఁదలఁచి యుర్వినినీచుల్
అపకృతి, యువతీ బృందము
నెపమున జగమునకుఁ జేయనేర్తురు సుదతీ?

అనవరతంబును "ఘోషా"
యనియెడు బంధంబు యువతి కనుచితమగు నం
గన నిర్మల హృదయంబునఁ
దన దేశాభ్యుదయమునకుఁ దరలఁగవలయున్.

ఘోరాహవము లొనర్చియు
స్వారాజ్యము నిందుఁ డట్లు సర్వ ధరిత్రిన్
నేరుపున నేలు భారత
వీరసతికి "చాటుమాటు" వెడఁగగుఁగాదే! ౩౦

కాంతులు భండన సీమ, న
నంతరిపుల నోహటించి యలసట చెందన్
ఇంతులు నిజ కాంతులకై
సంతసమునఁ బోరితోడు సల్పరె జగతిన్.

అరయఁగ వజ్రము కన్నను
దరుణుల చేతంబు కఠినతమమయ్యును, నీ
ధరఁ గుసుమముకన్నను మృదు
తరమునునగు వలయునెడలఁ దథ్యము సుదతీ!

ధీరప్రకృతులు పాండవ
వీరులకా ద్రుపదతనూజ విలసిత పథమున్
గోరి హితంబును సల్పుట
భారతమునఁ జదువలేదె? బాల్యమునందున్.

స్వాతంత్ర్యమనఁగ స్వైరిణి
యై తిరుగుట, పతికి నహరహంబు ననిష్టం
బేతటి నొనరించుచు నవి
నీతిగనుండుటయుఁగాదు నిజము కుమారీ!

సతీ సస్తుతి

నీతులు గీతులు నేర్చియు
నాతతశుభ కృత్యములకు నలవడక మనం
బేతటి వక్రపథాన, వి
నీతినిఁబోనడచువ్యక్తి నింద్యాత్మయగున్.

అతిథిజనంబుల ననదల
నతిప్రేమయుఁ బూజ్యభావ మాత్మోచితమా
గతిఁ బూని, గౌరవింపుము
క్షితి, సంస్తవనీయమైన శ్రేయము గలుగున్.

అన్యోన్య సుమానుషము, న
నన్యగతిన్ రక్షసేయు చాత్మైక్యమునన్
మాన్యతనందియు బ్రతుకుట
ధన్యచరిత ! సతికిఁ బతికిఁ దగుశ్లాఘ్యంబై.

తనవారికిఁ బెఱవారికి
ననయము సమబుద్ధితోడ నత్యాదృతి, మ
న్ననఁ గావించుట యుక్తము,
తనవైభవ మపుడె సఫలతనుజెందుసుమీ !

కనుగలిగి పనికిమాలిన
వని తెలిసిన పనులవంకకరుగక, భువి నీ
జననము సార్థకమౌనటు
లనయము కృషిసేయు ముత్తమాచరణంబౌ.

స్వాంతమునఁ బాలుమాలిక
చింతయు నావంతయైనఁ జేరఁగనీక
త్యంతము నుత్సాహంబు, ని
౫ రంతర మాత్మీయతృప్తి నందుము వత్సా! ౪౦

స్మితపూర్వ భాషితంబులు
మితలలిత వచఃప్రవృత్తి, మేదురవినయం
బతిసామ్య హృదయమునుగల
సతికిని నెయ్యెడల సాటి జగమునఁ గలదే?

కమనీయ హేమభూషలు
సుమములు సౌధాళిగావు సుదతికి ముఖ్యం
బమలమనోవృత్తియు, స
త్యము సుముఖత యున్నఁజాలుఁ దరుణీమణికిన్.

ప్రచురప్రచారములు, స
ల్పుచు స్వార్థత్యాగమున, నపూర్వోపకృతిన్
బచరించి, స్వీయదేశము
నచిరంబున వృద్ధిపఱచు నబలలఁ గనుమా!

చదివినను వ్రాయఁగల్గిన
ముదమున నతినిష్కళంకముగ, విహితంబౌ
పథమున దేశారాధన
సదయత నొనరింపనట్టి జన్మంబేలా?

సతీసప్తతి

పతిదేవతలయి పుణ్య
వ్రతలగు జనకాత్మజాది వనితామణులన్
సతతము ధ్యానముసేయుట
యతివలకును నన్యులకును నతిశ్రేయమగున్. ౮

ప్రాయము మించక పూర్వమె
నీయలవడు విద్య సుగుణ నిలయంబయి, యా
ప్యాయన మానటు సేయుము
శ్రీయును గీర్తియును నిన్నుఁ జేరును సుదతీ !

పరివిభవము నభ్యుదయము
పరికించి యసహ్యపడని భావంబున నీ
ధరణింగాలము గడపుచుఁ
జరియింపుము యుక్తమదియె జగతిఁ గుమారీ !

కేవల మైహికసౌఖ్యం
బే వలయునటంచు మాత్రమే కోరక నీ
భావమున ముక్తిసాధన
కై వరజ్ఞానోదయంబు గనుఁగొనుమమ్మా !

తగుశక్తికొలఁది నవసర
మగు కార్యములందు నచలమగు నుత్సాహం
బు గలిగి యత్నముసేయుము
తగుఫలము లభించు నిశ్చితంబు కుమారీ !

మనుజుల కావశ్యంబగు
గానములలోనెల్ల భూతకోటిని దయతోఁ
గనియెడు గుణమే సుగుణము
గను భావించెదరు భరతఖండ నివాసుల్. ౫౦

పరుషములగు భాషణములు
విరసములగు వచనములను వీఁడెడు వ్యక్తిన్
ధర, సర్వజనులు ప్రేమిం
తురు గూర్తురు సంతసంబుతో నుపకృతులన్.

వనితలు రహస్య రక్షణ
మును జేయఁగఁదగరటంచు మును ధర్మజుఁ డి
చ్చిన శాపము ప్రతిహతముగ
నొనరిచి యకలంక కీర్తినొందుము సుదతీ!

ఇతరులను బరోక్షంబగు
స్థితినైనను నిందితులుగఁ జేయుట తగదీ
క్షితి నయ్యదియే క్రమమున
నతివైరంబునకు మూలమగును కుమారీ!

పరులొనరించెడు కీడును
మఱచుటయును, జేయుమేలు మఱువక తానీ
ధరనున్నదాఁక మనమున
స్థిరముగ నెలకొల్పుటయును శ్రేయము సుదతీ!

శ్రమమునఁ గష్టములందెడు
సమయమునను విడువరాదు శాంతియు క్షమయున్
గ్రమమున నవియే సుశ్రే
యములను గలుగంగఁజేయు నవియగు సుదతీ! ౫౫

ఆరోగ్య మహాభాగ్య మ
పారంబుగఁ గలిగియుంట భాగ్యము, నదియే
స్వారాజ్యఫలము, సన్మతి
నారసి తెలిసికొని పొందుమమ్మ! ఫలంబుల్.

అతివను నమ్మఁగవలదని
సతులకు ద్రోహంబుసేయు స్వల్ప ప్రకృతుల్
క్షితి, వెలయునంతకాలము
నతిహీనత నొందుదేశ మంతయు సుదతీ ?

కలవారు గాక భైక్ష్యము
వలనను జీవితముగడపు వారైనను దా
మిలుసేరు దానివలననె
బలుతృప్తిని బడయఁగనుట భాగ్యము సుమ్మీ!

పరమ దరిద్రులమని, భీ
కరమగు సంసార ఘోర కర్మంబని, యు
ర్వర, దగ్ధచిత్తులగు పా
మరనరులకు సుగతి గల్గు మార్గము గనుమీ!

సతతము శౌచము, సత్య
వ్రతమును ద్యజియించి సుగుణవతిగాకయు, నీ
క్షితి నెన్ని తీర్థయాత్రల
వెతనొందిన సుకృతిగలిగి విహితంబగునే? ౬౦

ఎడ్డెతనంబగు చేతలు
బిడ్డలుగావింపఁజూచి ప్రియమందకుమీ
చెడ్డతనంబును గలయా
బిడ్డలె లోకాపకార ప్రియులు కుమారీ!

గృహమునను నిత్యవైర
గ్రహమున శుష్కించునట్టి కాంతల కెపుడున్
మహిత జ్ఞానోదయమున
నిహపర సాధనము చూపు నెంతయుఁ దల్లీ!

పిల్లల యారోగ్యమునకుఁ
దల్లులె బాధ్యతగలారు తగుతీరున, నీ
వెల్లపుడతి శౌచంబుగ
నిల్లంతయు భద్రపఱుపు మెంతయు శ్రద్ధన్!

నీ వింటికిఁ దీర్పరివే
గావలయును, గానినాఁడు కలుగును గష్టం
బేవిధముగఁ బరికించిన
నీ విషయమె ముఖ్యమగుట నిజము కుమారీ?

సతీసప్తతి

దైవమె కలఁడని తూష్ణీం
భావముననునీదు కార్య భారము విడువం
గావలదు పురుషకారము
నావశ్యకమండ్రు భూజనాళికి సుదతీ ?

కలహామె భోజన విధముగఁ
గలిగి యహర్నిశము గల్గు కష్టంబుల యో
పల జీవితమును గడపెడు
లలనకు నాకాఁపురంబు రౌరవమె యగున్.

కలిగినది పురాకృత క
ర్మలవలనను గష్టసమితి; మనుటయునిఁక నే
ఫలమునకని నైరాశ్యము
వలనను శుష్కించు మూఢవనిత కుమారీ !

భూతములని ప్రేతములని
నాతులలోఁ గొందఱిల ననాగరికముగా
చేఁతలుగావించుచు నవి
నీతిగ ఘోరములుసేయ నేర్తురు సుదతీ !

పరులకు నుపయుక్తంబగు
తెరువరయుచు సతతము, నైజధీవిభవము చే
మెఱియుచు గుణములగనివై
ధరణిని జీవింపుమమ్మ దైవబలమునన్.

ఆసభారతీయ యువతీ
జనులకు హితమైనయిట్టి సప్తతి గ్రంథం
బును కొత్త సత్యనారా
యణ చౌదరి సంతరించె నవనీఁ గుమారీ ! 20

---

నిడుబ్రోలు తాతాముద్రాక్షరశాలయందు ముద్రితము—10-8-1931.

రాఁబోవు గ్రంథములు.

౧ మనుస్మృతి

౨ చంద్రాపీడచరిత్ర

3 సుభాషితము.

తేట తెలుఁగు వచనరచనము.